509. బాబా నిత్యము భిక్షించు గృహములలో నందరామ్ - యస్. మార్వాడి - గృహమొకటి. షిర్డియందు ప్లేగువ్యాధి వ్యాపించి నందరామునకు జ్వరము తగిలెను. అతడు భయపడి షిర్డి విడిచి వెళ్ళ దలచెను. (చూ. 37)

సా. బా: వెళ్ళవలదు. నీవు మరణింపవు. నేను తనువు విడుచు వరకు నిన్ను మృతినొందనీయను.

బాబా అతనికి ఉధిని ప్రసాదించెను. అతని జ్వరము తగ్గెను. అతడింకను [1940 నాటికి] జీవించియే యున్నాడు.

510. 1914 శ్రీరామనవమియందు లక్షల జనము బాబా చుట్టు జేరిరి. ఒక వృద్ధురాలు బిగ్గఱగ అఱచుచుండెను.

వృద్ధురాలు : ఓ బాబా! ఈ ముదుసలిదానిపై కరుణ వహింపుము. ఓ బాబా! నీ దర్శనము నాకు ప్రసాదింపుము.

శ్యామా వెలుపలకు వెళ్ళి జనసమూహమును త్రోసికొనుచు, ఆ వృద్ధురాలిని బాబా సన్నిధికి గొనివచ్చెను. ఆమె సంతోష బాష్పములను స్రవించుచు, తన రెండు చేతులతో బాబా నడుమును బంధించెను.

సా. బా: అమ్మా! నీకొరకెంత కాలమునుండియో వేచియుంటిని. నాకు ఏమేని తినుటకు తెచ్చితివా?

వృద్ధురాలు : ఇదిగో చలిది రొట్టెముక్క - ఉల్లిగడ్డ. నేనొక రొట్టె, రెండు ఉల్లిగడ్డలను తీసికొని ప్రయాణమై వచ్చితిని. ఈ ఉదయము ఆకలి నొంది ఒక ఏటి దఱినిజేరి సగము రొట్టె నొక ఉల్లిని భక్షించితిని. శేషించినవి యివిగో - వీనిని నీవు భక్షింపుము.

సా. బా: [ఆ చప్పని రొట్టెముక్క నమలుచు అత్యాసక్తితో తినుచు] అమ్మా! నీ రొట్టె ఎంత మధురముగా నున్నది! [చూ. 515]

511. 1913 న నామసప్తాహము జరుగు సమయమున పలువురు భక్తులు గుంపులు గుంపులుగ బాబాను క్రమ్ముకొని కూర్చుండిరి.

సా. బా: శ్యామా! వెలుపలకు వెళ్ళుము. ఆ గోడకు వెలుపల నొక వృద్ధుడు కూర్చున్నవాడు. అతని దగ్గర కలకండ కలదు. నాకై కొంచెము కలకండ అడిగి తెమ్ము!

శ్యామా వెళ్ళి ఒక ముదుసలి వానిని జూచెను. అతని నోటినుండి చొంగకారుచు, రొమ్ముపైగల కురుపునుండి చీము స్రవించుచు ఈగలు క్రిమ్ముకొని యుండెను. శ్యామా జన సమూహమును ద్రోసికొనుచు ఆ వృద్ధుని వెంటగొనివచ్చి, "అతడిడుగో!" - అనెను. బాబా తన అభయ హస్తము నతని మస్తకముపై జేర్చి, ఆశీర్వదించి, అతని మూటనుండి కొంచెము కలకండ తీసికొని, శేషించినది (ప్రసాదముగ) కొనిపొమ్ము" – అనెను.

512. 'బస్సీను' నివాసి, వఖర్కర్ – బాబా కొఱకు ఒక అరటి పండ్ల గెలను పంపెను. ఆ గెలను మోసికొని వచ్చినవాడు దాని నొసగక బాబా ఎదుట దూరముగ నిలిచియుండెను.

సా. బా: ఓయీ! (ఆ గెల తెచ్చిన మనిషితో) ఆ గెలనుండి ఒక పండు తీసియిమ్ము! అతడు (వఖర్కర్) ఇంతవరకు భోజనము చేయలేదు. బాబా అరటిపండు భక్షించినాడని తంతి పంపుము! అపుడతడు భుజించును.

బాబా అపుడు పలికిన మాటలే వఖర్కర్ తనతో జెప్పినట్లు ఆ గెల తెచ్చినవాడు జ్ఞప్తికి దెచ్చుకొనెను.

513. 1915 జనవరిలో సంక్రాంతికి 8 రోజులు ముందు –

సా. బా: సంక్రాంతికి హల్వా పంపుము.

వార్తాహరుడొకడు మిఠాయి కొట్టునకు వెళ్ళి తిరిగివచ్చి "సంక్రాంతి యింక 8 రోజులుండుటచే దొరకలేదు" - అనెను.

సా. బా: సంక్రాంతి హల్వా నాకిపుడు కావలయును.

వార్తాహరుడు మిఠాయి అంగడికి వెళ్ళెను. అప్పుడే తపాలా మనిషి ఒక బంగీ తెచ్చి బాబాచేతి కిచ్చెను. భక్తుడొకడు ప్రత్యేకించి సిద్ధపఱచి ముందుగ రుచి చూచుటకై పంపిన (టిల్‌గుల్) సంక్రాంతి హల్వాగల బంగీ అది. బాబా తన అంతర్జ్ఞానమున అది ఎప్పుడు పంపబడినది - యెప్పుడు చేరినది తెలిసికొన గలిగినాడు.

514. సా. బా: నాకు (కాచేరి) వంకాయ కారపు - కాయ కావలయును.

అవి అపుడు అంగడిలో లేవు. పురందర్ భార్య కెవరో వంకాయలు పంపుటచే నామె బాబా కొఱకు (వేపుడు) కారపుకాయ సిద్ధము చేయుచుండెను. ఆ విధముగ నెవరు అడుగకయే తనకు అందింపబడిన ప్రేమపూర్వక బహూకృతిని గుర్తించి బాబా తన అభీష్టములను తెలిపినాడు.

515. సా. బా: (గోవింద బాలకరాం మాన్కర్‌తో) నా కొఱకు ఏమైన నీవు తీసికొని వచ్చితివా?

గో. బా. మా: ఏమియు తీసికొనిరాలేదు - బాబా.

సా. బా: నాకై తీసికొని వెళ్ళుమని ఎవరు నేమియు నీయలేదా?

గో. బా. మాన్కర్ : లేదు - బాబా!

సా. బా: నాయనా! నీవు బాంద్రానుండి బయలుదేరునపుడు ఆ తల్లి ఆర్. ఎ. తార్కాడ్‌సతి అత్యంత భక్తి ప్రేమలతో నా కిమ్మని మిఠాయి (లడ్డు) నీకీయలేదా?

గో. మాన్కర్ : అవును - బాబా! ఇప్పుడు నాకు జ్ఞాపకమునకు వచ్చినది.

ఇంతకు ఆ లడ్డు ఎప్పుడో తయారు చేయబడి, బాంద్రాలో బాబా పటమునకు నివేదింపబడినది. మాన్కర్ ద్వారా బాబాకు పంపుటకు ఇతరమేమియు నప్పటికి లేనికారణమున ఆ తార్కాడ్‌సతి అత్యంత భక్తిప్రేమలతో ఆ పాత మిఠాయి పంపినది.

516. బాబా ద్వారకమాయి మసీదునందు మధ్యాహ్నమున ఆసీనుడై యుండగ పలువురు భక్తులు పెక్కుపళ్ళెరములలో నైవేద్యములను గొనివచ్చి బాబాముందు పెట్టిరి. కాని, బాబా వాని నేమియు తాకలేదు. జి. యస్. కపర్దేసతి పళ్ళెరములో నైవేద్యము తెచ్చి బాబాముందుంచిన తోడనే బాబా ఆ పదార్థముల రుచి చూచెను.

శ్యామా : దేవా! ఏమిది? యిది యెట్టివేర్పాటు? ఇతరులు తెచ్చిన వానిని నీవు తాకనైన తాకలేదు. ఈ తల్లి పళ్ళెరమున నైవేద్యము తెచ్చిన తోడనే రుచి చూచుతివి!

సా. బా: ఈమె (జి. యస్. కపర్దేసతి) పూర్వమొక వైశ్యుని గోవు (నాకు) సమృద్ధిగ క్షీర మొసంగినది. తరువాత తోటమాలి కూతురుగ జనించి, క్షత్రియుని దగ్గఱ జేరెను. అపుడొక కోమటిని వివాహమాడెను. ఆ పిదప ఆమె బ్రాహ్మణ జన్మమొందెను. చాలాకాలము గడిచిన పిదప ఆమెను మరల జూచుచున్నాడను. ఆమె నాకొసగు నాహారము (అపార ప్రేమ రసమిశ్రితమై) మిక్కిలి మధురముగ నుండును.

517. దుర్గంధము గలిగి దుర్బలుడైన ఒక కుష్ఠరోగి తన మురికి గుడ్డ కొంగున పాలోక్వా (పేడా) పొట్లమును మూట కట్టుకొని, దానిని బాబాకు బహూకరించి, యందు కొంత తిరిగి ప్రసాదముగ స్వీకరించు తలంపుతో ద్వారకామాయి మసీదుమెట్లను మెల్లగ నెక్కుచు, 'ధుని' దగ్గఱకేగి ఊఁదినిజేకొని బాబాచేతియందుంచెను. సిగ్గు, భయములు పీడింప ఆ పేడా పొట్లము బాబాకు బహూకరింపకయే మరలి వెళ్ళుచుండెను. బాబాదగ్గఱగ గూర్చున్న ఒకకాంత (సదాశివతార్కాడ్‌సతి) ఆ చెడుకంపు కొట్టుచున్న ఆ కుష్ఠరోగి వెడలిపోవుట చూచి "బ్రతికితిమి స్వామీ! యీ పీడ వదలిపోయినది" అని, తనలో దలంచెను.

సా. బా: (ఆమె వైపునకు తీవ్రము నిశితమైన దృష్టిని ప్రసరించుచు) ఓయీ! ఆ మనిషి నిటు తిరిగి పిలువుము!

ఆ కుష్ఠరోగివచ్చి, ఆ మిఠాయి పొట్లము తన చేతులలోనే యుంచుకొని ప్రణమిల్లెను.

సా. బా: (ఆ పొట్లము తీసికొని విప్పి) అహో! ఏమి యిది? (పేడా) మిఠాయియా?

సా. బా: అందు కొంచెము తీసి తార్కాడ్‌సతికి యిచ్చి దీనిని భక్షింపుము.

అంతట బాబా ఆ మిఠాయిలో కొంచెము తన నోటిలో వేసికొనెను.

ఆ సతికి వచ్చినంతపనియైనను, తోడి జీవులందు సానుభూతి గురువునందు గాఢ విశ్వాసము వహింప వలయునను పాఠమును తనకీ రూపమున బాబా బోధించుచున్నాడు – అని తలచి ఆమె ఆ మిఠాయిని మింగెను.

సా. బా: (అందు మిగిలిన మిఠాయిని ఆ కుష్ఠురోగికి తిరిగి యిచ్చుచు) ఈ ప్రసాదమును తీసికొని పొమ్ము!

1. నిర్మల మనస్సుతో సమర్పించు బహుమతులు

ఎ. (గార్డే – మామిడి పండ్లు – పండిట్ – శేషించిన లడ్లు)

518. కె.కె. గార్డే, బి.ఎ.,యల్.బి., (నాగపూరు సబ్జడ్జి ఉద్యోగము నుండి విరమించిన వాడు) పూనాలోని 'రే మార్కెట్' నందు మంచి చక్కని మామిడి పండ్లు మూడింటిని గొనితెచ్చి వానిని బాబాకు సమర్పించెను.

సా. బా: (వానిని స్వీకరించుచు) అహో! ఇతడు (గార్డే) అంగడిలో నా కొఱకు కొనిన పండ్లన్నియు, మొన్న ఆ పండిట్ చేసినట్లుగాక (వీనిలో నేమియు తాను భక్షింపక) తీసికొనివచ్చి సమర్పించినాడు. పండిట్ పొట్లము లో కట్టిన లడ్లన్నిటిని నా కీయవలయునని తీసికొనివచ్చుచుండెను. కాని, మార్గమున గోదావరిలో స్నానముచేసి ఆకలి నొంది ఆ పొట్లములోని లడ్లలో కొన్నిటిని తిని శేషించినవి తెచ్చి నా కిచ్చినాడు. ఈ ఫలములు ఆ లడ్లవలె 'భుక్త శేషములు' కావు.

బి. మలిన మనస్సుతో నొసగు బహుమతులు

భికూబాయి – పూలమాల – కర్బూజ ఫలములు, పాలోఖ్వా

519. భికూబాయి బయ్యాజి పటేల్ అహమ్మద్‌నగర్ నుండి షిర్డీకి తిరిగి ప్రయాణమై పూలమాల, కర్బూజా ఫలములు, దూద్‌పేడా వెంటగొని వచ్చుచుండెను. కోపర్గామునందు గోదావరి నదిని దాటెను. తన సఖియొక్క దుర్మరణమును జ్ఞప్తికి దెచ్చుకొని అచట నేడ్చుచు, తన సఖిని ఆ దుర్మరణము నుండి రక్షించినవాడు కాడని, బాబాను తన మనస్సున నిందించెను. కాని, షిర్డికిజేరి బాబాకు ఆ తెచ్చిన వస్తువులు బహూకరించునపుడు అట్టి తలంపు లన్నిటిని మఱచియే యుండును.

సా. బా: ఈ (తల్ - తల్) మానసిక వ్యాకులతతో గూడిన పూల మాల నాకు వలదు.

అంతట నామె ఆ పూలమాలను రెండు చేతులతో తీసికొని బాబా మెడలో నిలుప దగ్గఱకు జేరెను. ఆశ్చర్యముగ ఆ పూలమాల ముత్తునియలై ఆమె రెండు జేతులలో రెండు ముక్కలు నిలిచి, నేలపై నొక ముక్క పడెను. అంతట ఆమె కర్బూజ ఫలములను, పాలో్కవాను సమర్పింపబోయెను. బాబా వానిని నిరాకరించెను.

సా. బా: ఈమె గోదావరి తీరమున దుఃఖించుచు కన్నీరు కార్చుచుండెను. అట్టి వ్యాకుల మనస్సుతో వీనిని తీసికొని వచ్చినది - కావున వీనిని స్వీకరింపను.

సంశయాత్మక బహూకృతులు

కనిత్కార్ కాంత – ద్రాక్ష ఫలములు

520. కనిత్కార్‌సతి తన పుత్రికలతో గూడి బాబాకు సమర్పింప ప్రత్యేకముగ మిక్కిలి ప్రేమతో మంచి ద్రాక్ష ఫలములను బుట్ట నిండుగ తీసికొని వెళ్ళెను.

సా. బా: (కరుణాస్వరమున) నీవేమి తీసికొనివచ్చితివి? ద్రాక్షలా!

క. సతి : అవును బాబా! నీ కొఱకు వానిని నాశిక్‌నుండి తెచ్చితిని.

అంతట నామె ఆ పండ్లబుట్టను బాబాకు సమర్పించెను. బాబా ఫలములు కొన్ని త్రిప్పిచూచుచుండగా - ఆమె కూతురు - బానుతాయి "ఈ పండ్లన్నియు బాబాచే పంచిపెట్టబడి వ్యర్థము కానున్నవి" - అని తలంచెను

సా. బా: (ఆ బుట్టను కనిత్కార్‌సతివైపునకు త్రోయుచు) నీబుట్టను నీవు తీసికొనిపొమ్ము!

కనిత్కార్‌సతికి పైప్రాణములు పైన పోయినట్లయ్యెను. ఆ తల్లి పొందిన మానసిక బాధను బాబా గుర్తించి ఆ బుట్టనుండి యెండిపోయి పనికి రానిపండ్లను కొన్ని తీసికొని, శేషించిన వానిని తిరిగి యిచ్చుచు "యిపుడు పొమ్ము! నీ బిడ్డలను వీని దిననిమ్ము" - అనెను.

కనిత్కార్‌సతి, ఆమె కుమార్తెలు ఆ పండ్లబుట్టతో తిరిగి పోవుచుండగా "అమ్మా! నా కట్టి ఆలోచన ఏల కలిగెనో నే నెఱుగను. నీ వాబుట్టను

బాబాకు బహూకరింపగా "ఏమి! యీ పండ్లబుట్టనంతయు నిచ్చినదే! క్షణములో నివియన్నియు పంచిపెట్టబడును. బాబా ఏమియు తినడు. మన క్షేమియుదక్కవు- అని తలంచితిని"అని బానూతాయి తల్లితో పలికెను.

బాబా చర్యలు - పలుకులు - ఆ తల్లియొక్క ఆశయము - ఆమె బహూకృతిని గూర్చిన తలంపు - ఆ కూతురు యొక్క అనిష్టత వలన చెలుప బడినదిగ విశదీకరించునట్లు గమనింపదగును.

## 2. బాబా - భక్తుల కొఱకు స్వార్థత్యాగము

### (ఎ) బల్వంతు జి. కపర్దే ప్లేగువ్యాధిని తన చక్కికి బాబా ఆకర్షించుకొనుట.

521. 1911 - 12 లో షిర్డియందు ప్లేగువ్యాధి వ్యాపించెను. జి. యస్. కపర్దే - కుమారుడు బల్వంతునకు (ప్లేగు సంబంధమైన) జ్వరము తగిలెను.

జి. యస్. కపర్దేసతి : బాబా! మేము వెళ్ళుటకు సెలవిమ్ము?

సా. బా: మబ్బులు క్రమ్మినవి, పిదప వర్షించును. అంత పైర్లు పెరిగిపండును. మబ్బులు విచ్చును. నీవు భయపడనేల?

కపర్దేసతి బాబాపలుకులను గ్రహింపలేక వెడలిపోయెను.

తరువాత బాబా తన కుపినీ పైకెత్తి తనకడుపు మీద ప్లేగు బొబ్బలను చూపుచు - "అమ్మా! చూడుము! నీ కష్టములను నివారించుటకై నేను మీ కొఱకు కష్టపడవలయును.

బల్వంతు తనువునుండి ఆ ప్లేగు బొబ్బల జ్వరమును బాబా ఆకర్షించు కొనెను. బాబా జ్వరముతోడ బల్వంతు జ్వరము రెండు, మూడు దినములలో శమించెను.

గమనిక : ఈ విధముగ 'గోవా' లోని పోలీసు సూపరింటెండెంటు ప్లేగువ్యాధిని గూడ బాబా తన చక్కికి ఆకర్షించుకొనినాడు.

(బి) బాబా – తన కంఠమును సమర్పించుట.

522. ఆర్.ఎ. తార్కాడ్- కంధహార్ నివాసి మీర్జమాన్, యింకను యితరులు చావడిలో బాబాసమీపమున నిద్రించు చుండిరి. మీర్జమాన్ అర్థరాత్రమున నిద్రలేచి బాబాతో నిట్లనెను.

మీ. జ: బాబా! ఈ హైందవులు నిన్ను - ఇస్లామ్ మతమును చెఱచు చున్నారు. నా కనుజ్ఞ నిమ్ము! నా ఖడ్గముతో వీరి యందఱి కంఠములను క్షణములో తెగ్రవేయుదును.

సా. బా: నేను (పాగల్) పిచ్చివాడను. నన్ను సేవించు నీ హైందవులు పిచ్చివారు. వారి అత్యాచారములకు నేను బాధ్యుడను. నా ప్రవర్తనమునకు వారు బాధ్యులుకారు. నీవెవరి కంఠమునేని తెగ్రవేయు దలచితివా - నా కంఠమునే తెగ్రవేయుము.

అది మొదలు మీర్జమాన్ శాంతి వహించెను.

(సి) బాబా – ఆరోగ్య త్యాగము

523. సా.బా: 1910 (జి. యస్. కపర్దేతో) 2 సంవత్సరముల నుండి నేను రొట్టె - నీరము మాత్రము గొనుచు జబ్బుపడి యున్నాడను. నారకురుపు నాకేర్పడినది. జనులు క్రమ్ముకొని నాకు విశ్రాంతి నీయరు. నేను స్వస్థానము చేరువరకు నీ విధముగనే జరుగును. నా ప్రాణముల కంటె నా బిడ్డల రక్షణమే నా ప్రధాన లక్ష్యము. కావున వీనిని నేను లెక్కచేయను.

3. బాబా – భక్తుల తలంపులను మన్నించుట - ప్రతిఫలమును ప్రసాదించుట

(ఎ) తల్లియొక్క ప్రార్థనము – (హరిభావ్ – పన్సే)

524. దహన్కర్‌లోని హరిభావ్‌పన్సే - తన తల్లి వలదనుచున్నను రామేశ్వరము యాత్రకు బయలుదేరెను. ఆతడు తిరిగివచ్చు వరకు అతని తల్లి ఉపవసింప నిశ్చయించుకొనెను. తన సుతుడు షిర్డియందు బాబా దగ్గఱ నున్నవాడని తెలిసికొని బాబానిట్లు ప్రార్థించెను. 'బాబా!

నీవు సత్యముగ సాధుసత్పురుషుడ వగుదువేని నా కుమారుని తీర్థయాత్ర విరమింపజేసి, అతని తిరిగి యింటికి వచ్చునట్లు చేయుము!'

సా. బా: (హరిభావ్‌తో) నాకు దక్షిణ నిమ్ము!

హరిభావ్‌దగ్గఱనుండి దక్షిణ రూపమున షిర్డి నుండి రామేశ్వరమునకు వెళ్ళివచ్చుటకగు ప్రయాణము ఖర్చు ధనమంతయు దీసికొనెను.

సా. బా: (హరిభావ్‌తో) ఇంటికి పొమ్ము! నీ - విల్లు విడిచి వచ్చినది మొదలు రామేశ్వరము పస్తుపడి యున్నది. నీ విప్పుడు తిరిగి వెళ్ళవేని రామేశ్వరము అంతరించును. ఆ స్థానమును భద్రేశ్వర మాక్రమించును.

హరిభావ్ తిరిగి యింటికేగి తన తల్లి ఉపవాసము - ఆమె బాబాను గూర్చి కావించిన ప్రార్థనములు, బాబా ఆమె ప్రార్థన మనుగ్రహించిన విధము సకలము గ్రహింపజాలెను.

### (బి) కుశలభావ్ - పవిత్రమైన కోరికలు

525. బాబా ఒకనాడు హ. సీ. దీక్షిత్తును టాంగామీద రహాతాకు వెళ్ళి, తనకుగూర్చు భక్తుడైన కుశలభావును దోడ్కొనిరమ్మని నియమించెను. కారణమేమి? ఆ క్రిందటి దినము - బాబాను దర్శించి చాలా కాలమైనది-అని కుశలభావ్ తలంచెను. ఆ రాత్రి బాబా అతని స్వప్నమున గోచరించి "షిర్డికి రమ్ము' - అని ఆదేశించెను. ఆ మఱునాటి యుదయమున టాంగామీద షిర్డికి వెళ్ళుటకు గుఱ్ఱములేని కారణమున తాను వెళ్ళలేక తనకు మాఱుగ తన కుమారుని కాలినడకతో షిర్డికి పంపెను. ఆ కుశలభావ్ కుమారుడు షిర్డికిజేరు పూర్వము -

సా. బా: కాకా! (హ. సీ. దీక్షిత్తు) టాంగా తీసికొని రహాతాకు వెళ్ళి, కుశలభావు నిటకు దోడ్కొని రమ్ము!

హ. సీ. దీక్షిత్తు కుశలభావును జేరగా నతడు తాను వచ్చుటకు గుఱ్ఱము లేదని చెప్పెను.

హ. సీ. దీక్షిత్తు: అందుచేతనే టాంగా తీసికొనివెళ్ళి నిన్ను తోడ్కొనిరమ్మని బాబా నియమించినాడు.

కుశలభావ్ తాను మిక్కిలిగ నభిలషించుచున్న బాబా సందర్శనము చేసికొన గలిగెను.

(సి) బాబా – భక్తుల తలపులను మన్నించుట – (మావుషే)

526. సా. బా: (ఒకనాడు) నా కడుపు నొప్పిగా నున్నది.

అంతట 'మావుషే' కాల్చిన యిటుకరాతితో బాబా పొత్తికడుపు మీద కాపుకాచెను. ఆ పిదప నామె తన బలముకొలది అతి తీవ్రముగ బాబా పొత్తికడుపు ఇరుప్రక్కల నొత్తుచుండెను. అచటనున్న యమ్. బి. నాచ్నే – "ఆపుము! ఆపుము! మెల్లగ నొత్తుము! బాబాకు బాధ కలుగును" - అనెను.

సా. బా: వెలుపలికి పొమ్ము! జోక్యము కల్పించుకొనకుము!

(డి) బాబా- నాచ్నే అత్తగారి దగ్గరనుండి ఉల్లిగడ్డలను తీసికొనుటకు దాదా కేల్కారును నియమించుట. (చూ. 284)

(ఇ) వధవ్కర్ – ఆకలి

527. సదాశివ - టి - వధవ్కర్, బాబానుచేరి ఎదుట కూర్చుండెను. అతనికి ఆకలి పీడించుచున్నను చెప్పుకొన జంకెను. ఒకరు పేడా (లడ్డు) పొట్లమొక దానిని బాబాకు సమర్పించెను. ఏమేని కానికలుగా వచ్చిన పదార్థములను బాబా తాకడు. ఈ తఱి, ఆ పొట్లమును విప్పి వధవ్కర్ వైపునకు ఒక లడ్డు విసరివైచెను. వధవ్కర్ దానిని తన చేతిలో నుంచుకొనెను.

సా. బా: నీ చేతిలో నుంచుకొనుటకు దాని వేయలేదు.

అంతట వధవ్కర్ దానిని తినెను. సగము ఆకలి తీరెను. అంతట మఱియొక లడ్డును బాబా పడవైచెను. వధవ్కర్ ఇంటికి తీసికొని వెళ్ళవలెనని తన చేతిలో నుంచుకొనెను.

సా. బా: దానిని దాచుకొనుటకు వేయలేదు.

వధవ్కర్ దానిని భక్షించెను. ఆకలి పూర్తిగ శమించెను. బాబా ఆ పిదప అతని వైపునకు లడ్డు పడవేయలేదు.

528. (1) 1911 న బి. వి. వైద్య - కుటుంబముతో రాత్రి 1 గంటకు షిర్డికిజేరి సాతేవాడలో విడిసెను. ఏదో అల్పాహారము (ఫరల్) తీసికొని నిద్రించెను. (ఆ మరునాటి ఉదయమున)

సా. బా: (కోపముతో - ఆ వాడలోని మనుష్యులతో) నా బిడ్డలు వచ్చిరి. ఎవ్వరు వారిని గూర్చి విచారించినవారు కారు. వారిని పస్తు పరుండ నిచ్చిరి.

(అని పలుకుచు మసీదున చేరిన భక్తులనందఱను బాబా తఱిమి వేసెను).

(2) షిర్డిని విడిచి నాశిక్ వెళ్ళదలచి 'వైద్య' బాబాను జేరి సెలవు కోరెను.

సా. బా: నాశిక్‌నకు వెళ్ళుచున్నావా? అచట కేల వెళ్ళవలయును? అచట ప్లేగు గలదు. వెళ్ళవలదు. నీ కుటుంబముతో నింటికి పొమ్ము.

(3) వైద్య బాబా చిత్రపటమును దీసికొని వెళ్ళి బాబాచేతులం దుంచెను. బాబా దానిని స్పృశించి (పూజించుకొనుటకు) అతనికి తిరిగి యిచ్చెను.

సా. బా: నీ విప్పుడు వెళ్ళుము.

'వైద్య' తన కుటుంబముతో ప్రయాణముచేసి రైలుస్టేషన్ చేరు నప్పటికి రైలు తప్పెను. అది వారి దురదృష్టమనుకొని, తరువాత బండి కొరకా స్టేషనులో కొన్ని గంటలు గడపిరి. అటు పిమ్మట వచ్చిన రైలులో 'మన్మాడ్' చేరిరి. అంతకుముందు వెడలిన బండిలో ప్రయాణముచేసి మన్మాడ్‌లో బండిమారి మఱియొక బండిలో వెళ్ళిన యెడల ఆ బండికి కలిగిన ప్రమాదంలో నొక పెట్టె తుత్తునియలగుటచే బాబా తమకా అపాయము కలుగనీయక కోపర్గామలో బండిని తప్పించెనని వారు తెలిసికొనిరి.

4) ఒక సమయమున వచ్చినపుడు సెలవు దాటిన తరువాత గూడ 'వైద్య'ను, అతని కుటుంబమును బాబా షిర్డియందు నిలిపెను.

సా. బా: ఊరకుండుము. భయము వలదు.

సెలవు గడువు దాటిన 3 రోజుల తరువాత తిరిగివెళ్ళి సెలవు పొడి గింపుమని కోరుచు జి. ఐ. పి. రైల్వే అధికారులకు కాగితము వ్రాసికొనగా నెట్టి కష్టములేక సెలవు ఈయబడినది.

(జి) బాబా - ప్రధాన్‌సతి పసిబిడ్డ ఏడ్పులాలించుట.

529. యం. డబ్లుయు - ప్రధాన్‌సతి ద్వారకామాయ మసీదునందు బాబాపూజ కావించుచుండెను. అదాటుగ బాబా ఆమె కావించు పూజను ఆపెను.

సా. బా: ఆపుము! నీ విడిదికి (వాడ) వెళ్ళుము!

ఆమె పూజనాపి విడిదికి వెళ్ళెను. ఆమె పసిబిడ్డ యేడ్చుచుండుట కనెను. ఆ బిడ్డ నోదార్చి, నిద్రపుచ్చి తిరిగి బాబాదగ్గఱకు జేరెను.

సా. బా: ఇపుడు నీ పూజ కానిమ్ము!

ఆమె విడిది మసీదునకు చాల దూరముననున్నను బాబా తన అంతర్ జ్ఞానముచే నా బిడ్డ ఏడ్పు వినెను. అట్టి వినికడినిగూర్చి ప్రసిద్ధమైన గేయమునందిట్లు తెలుపబడినది.

"ముంగీకి పాప్‌మే ఆవాజ్ హెూవే
ఓభీ సాయీ సుంతాహై"
(చినచీమ అడుగువేసిన సవ్వడేని
విననేర్చు సాయీ యీపృథ్వి నెందేని).

(హెచ్) పురందర్‌యొక్క మూర్ఖపు పట్టుదల

530. భక్తులు వెండిపాలకిని సంపాదించిరి. దానికి పూన్చిన వెండి గుఱ్ఱము లపహరింపబడెను. ఆర్. బి. పురందర్, అతని మిత్రులా వెండి పాలకిని భద్రపఱచుటకు మసీదు ఉత్తరమువైపున నొక గదిని నిర్మింప దలచిరి. గదిని నిర్మించుచుండిరి. బాబా లేని సమయమున మసీదు గోడకు పురందర్ రంధ్రములు తొలుచుచుండెను. బాబావచ్చి ఆ పనిని ఆపుమని ఆజ్ఞాపించెను. బాబా బెదరించుచున్నను పురందర్ ఆ పనిని సాగించుచునే

యుండెను. తన భోజనమువేళ దాటినను దానిని పాటింపక పురందర్ తన పనియందే నిమగ్నుడయ్యెను.

సా. బా: ఇదియెంత దుస్సహమో- గమనింపుడు. ఇతడు నామాటలను వినడు. దీనినంతయు నేను సహింపవలయును.

సా. బా: (మరల) నీవు భోజనమునకు వెళ్ళుము.

ఆర్. బి. పు: బాబా! నేను వెళ్ళను. నేను లేని సమయమున నేను చేసిన పనినంతయు నీవు తారుమారు చేయుదువు.

సా. బా: అట్లుచేయను. నీవు భోజనమునకు వెళ్ళుము.

అంతట పురందర్ భోజనమునకు వెళ్ళెను.

సా. బా: ఏమి చేయవలె? బిడ్డ మనకాలిపై మలము విసర్జించిన మనము కాలు నరకుదుమా? బిడ్డను ఛేదింతుమా? దానిని మనము సహింపవలయును.

## (1) వార్దే – మూర్ఖపు పట్టుదల

531. వార్దే : బాబా! మసీదునందు సత్యనారాయణ పూజ కావించుటకు నా కనుజ్ఞనిమ్ము!

సా. బా: నీవు చేసికొనుము.

అంతట వార్దే వెళ్ళి అరటి పిలకలను గొనివచ్చి, బాబాను ఒక విగ్రహముగ భావించి, బాబాకు అన్నివైపుల ఆ పిలకల నుంచెను.

సా. బా: అటుల చేయకుము. నే నటుల జరుగ నీయను.

అంతట వార్దే పెద్దపెట్టున నేడ్వదొడగెను. ఆ రోదన మంతకంతకు హెచ్చుటచే తుదకు బాబా సమ్మతించవలసి వచ్చెను - అపుడు –

వార్దే : ఖర్చులకు నా దగ్గఱ ధనములేదు.

సా. బా: నీ కెంత కావలయును?

వార్దే : రు. 2-8-0

సా. బా: (జయకర్‌ను చూపుచు) ఈతని దగ్గఱ కలదు. అతని దగ్గఱ నుండి అప్పు తీసికొనుము.

జయికర్ దగ్గఱ నున్నది ఆ మాత్రమే అయినను ఆతడు అప్పు నీయక తప్పినది కాదు వార్దే సత్యనారాయణ వ్రతము కావించెను.

4. బాబా – బిడ్డలను ప్రేమతో కనిపెట్టి రక్షించుట

1. ధులియా – బహల్కర్ బిడ్డ జబ్బు

532. 1913 మార్చి - 'రావుజీ బాలకృష్ణ ఉపాసనీ బహల్కర్' యొక్క చిన్న బిడ్డకు 5, 6 రోజులు పెద్ద పెట్టున జ్వరము తగిలెను. వైద్యులాస లుడిగిరి. బహల్కర్ బాబా పటము మ్రోలగూర్చుండి ప్రార్థించెను. రాత్రి 2 గంటలకు ధులియాలోని అతని గదిలో బాబా పొడమి, ఆ బిడ్డకు 'ఉధి' పెట్టుచు 'ఇంక మీరు ఆందోళన చెందవలదు. 2, 3 గంటలలో బిడ్డకు చెమటపోయును. ఉదయమున కీ బిడ్డ కోలుకొనును. పూర్తి ఆరోగ్యము బడసిన పిదప బిడ్డను నా దగ్గఱకు తీసికొని రమ్ము!' - అనెను.

ఉదయమునకు ఆ బిడ్డ కోలుకొనెను. ఇది 6-3-1913 ఆ ప్రాంతమున జరిగిన విషయము.

8-3-1913 న శ్యామా - రావుజీకి ఉత్తరము వ్రాసెను. అందు "ధులియాలోని" నీ మిత్రుని యింటికి నేను వెళ్ళినాను" అని బాబా చెప్పినాడు. 'మిత్రుడెవరు?' - అని నేను ప్రశ్నించితిని. 'ఉపాసనీ బహల్కర్ రావుజీ. నేను ప్రతి దినము అతని యింటికి వెళ్ళుచున్నాను. నీ వాతనికి ఉత్తరము వ్రాసి చూడుము!' - అని బాబా పలికినాడు. అందుచే నీ ఉత్తరము వ్రాయుచున్నాడను".

15 దినములు గడచిన తరువాత రావుజీ - ఆతని కుమారుడు షిర్డికి వెళ్ళుచుండిరి. మార్గమున కోపర్గామునందు టాంగా త్రోలువాడు జాగు చేయుచుండెను. ఆరతి సమయమున –

సా. బా: శ్యామా! కొంచెము సేపు ఆగి ఆరతి ప్రారంభించుడు! నీ ధూలియా మిత్రుడు వచ్చుచున్నాడు. ఆ టాంగా త్రోలువాడు వారికి కష్టము కలిగించు చున్నాడు.

రావూజీ - అతని కుమారుడు వేళకు జేరి ప్రసాదము నందుకొనిరి.

సా. బా: (బాలునితో) బిడ్డా! నీకు జబ్బు చేసినపుడు ధూలియాకు వచ్చితిని. నీకు జ్ఞాపక మున్నదా?

## 2. మహల్సాపతి – సర్పములు

533. 1) సా. బా: భగత్! రెండు సర్పములు మీ యింటివద్ద తిరుగు చున్నవి.

బాబాచే 'భగత్' (భక్తుడా!) అని పిలువబడు మహల్సాపతి ద్వారకామాయి మసీదునుండి యింటికి తిరిగివెళ్ళి అతని తలుపుదగ్గఱ ఒక సర్పమును, అచట కుమ్మరివాని దిండు క్రింద ఒక సర్పమును జూచెను.

2) సా. బా: భగత్! నీవీరాత్రి వచ్చునపుడు లాంతరు చే గొని రమ్ము. గ్రామద్వారమువద్ద దొంగలెదురు పడుదురు

ఆ రాత్రి లాంతరు తీసికొని మహల్సాపతి వచ్చుచు గ్రామ ద్వారము వద్ద సర్పమును జూచెను.

534. ఒక భక్తుడు మసకచీకటిలో మలవిసర్జనమునకు వెళ్ళెను. అచట నతడేమియో అకులకదలిక చప్పుడు వినెను. అదియొక సర్పమని నమ్మి త్వరత్వరగా అతని విడిదికి వెళ్ళెను. తరువాత బాబాను జేరెను.

సా. బా: నీవు వెలుపలకు వెళ్ళిన తావున నేను లేనా? నీవు భయపడనేల?

31. (చూ: పూనా నివాసి సదాశివతార్ఖాడ్‌పతి సర్పము మీాద పాదము నిలుపబోవుచు అంతర్జ్ఞానముచే అదాటున వెనుకకు తగ్గిన విషయము).

## 4) మిరికరునకు అభయము – సర్పము.

535. సర్దార్ మిరికర్ (బాబా భక్తులలో నొకడు) కుమారుడు 'బాలుసాహెబ్ మిరికర్' - మామ్లత్‌దార్ - బాబా సెలవు తీసికొన గోరెను.

సా. బా: మన ద్వారకామాయి కలదని నీవు ఎఱుగుదువా?

మిరికర్ గ్రహింపజాలక ఆందోళ చెందెను.

సా. బా: ఇచట నీవు గూర్చుండి యున్నది ద్వారకామాయి. ఇది తన బిడ్డల అపాయములను, ఆందోళనలను తొలగించును. ఈ మాసూది అయి మిక్కిలి దయామయి. తనను గాఢముగ విశ్వసించు బిడ్డలందఱకి ఈమె అనుగుతల్లి. ఆపత్కాలమున తనవారి నీమె రక్షించును. ఒకసారి విశ్వసించి ఆశ్రయించిన వాని కష్టము లన్నియు నివారణ మగును. (చూ. 1)

సా. బా: ఉధిని ప్రసాదించుచు మరియు నిట్లనెను. ఆ పొడవైన పెద్దమనిషిని నీ వెరుగుదువా? (బాబా బారచాచి ఒక అరచేతిని త్రాచుపాము పడగవలె కదలించుచు) అతడు మిక్కిలి భయంకరుడు. కాని, ద్వారకామాయి బిడ్డల నది యేమి చేయగలదు? అది కనబడిన మనము వినోదముగ జూతుము. ద్వారకామాయి రక్షింప నున్నపుడు సర్పము తాకగలదా!

మిరికర్ వెంట వెళ్ళుమని శ్యామాను బాబా ఆజ్ఞాపించెను. ఆ రాత్రి 9 గంటలకు మిరికర్ - శ్యామా మరి కొందరు 'చితాలీ' కి జేరి మారుతి దేవాలయమువద్ద నుండిరి. మిరికర్ వార్తాపత్రికల చదువు చుండెను. తటాలున వార్తాపత్రికల మీద కదలిక చప్పుడు 'జవాను' వినెను. లాంతరు తెచ్చి చూచెను. మిరికర్ ఉత్తరీయమున కొంత భాగము ఆ వార్తాపత్రికల మీద కలదు. ఆ వస్త్రము చివర ఒక సర్పము చేరి యుండెను.

'సర్పము' - 'సర్పము' - అని ఆ జవాను అరచెను. అది మిరికర్ దగ్గఱ నుండి తొలగిపోయెను. జనులుజేరి ఆ సర్పమును కఱ్ఱలతో కొట్టి చంపిరి. మిరికర్ వినోదముగ దానిని చూచెనేకాని, భయభ్రాంతుడు కాలేదు.

535-ఎ. షిర్డిలో బాబా ఒకనాడు (ప్రాణాపాయ) విచార సూచక శంఖారావము గావించుచు - 'అహో! నానా చావనున్నవాడు కాని నేను చావనిత్తునా?' - అనెను. ఆ సమయమున, నా. గో. చందోర్కర్ - లేలే శాస్త్రియు పూనా దగ్గఱ టాంగాలో ప్రయాణము చేయుచుండిరి. గుఱ్ఱము

టాంగాను వెనుకకు నెట్టుకొనిపోయి దానిని తలక్రిందులు చేసెను. చందోర్కరు-లేలేశాస్త్రి ప్రాణాపాయ స్థితిలో నుండిరి. వారు మెల్లగ లేచి యెట్టి గాయములు తగులలేదని గుర్తించిరి. తరువాత వారు షీర్డికి వెళ్ళినపుడు బాబా పైన తెలిపిన విధమున వారికి కలుగనున్న ఆపదను కనిపెట్టి రక్షించినట్లు తెలిపికొనిరి.

535-బి. ఆర్. వి. మోదక్ - తనకొక ప్రత్యేక పరీక్ష జరుపబడునని, దాని కతడు హాజరైన యెడల ఉద్యోగాభివృద్ధి పొందుటో లేక అతని అసమర్థత కారణముగ ఉద్యోగము నుండి తొలగింపబడుటో జరుగునని యాతడు భయపడు చుండెను. అతడు బాబాదగ్గఱకు వెళ్ళెను. బొంబాయిలో పరీక్ష గడువు దాటిపోవు వరకు అతనినట నిలిపెను. ఆ పరీక్ష తేదీ దాటిపోయిన తరువాత -

సా. బా: పొమ్ము.

మోదక్ : బాబా! ఎక్కడకు? ఇంటికా? బొంబాయికా?

సా. బా: ఇంటికి పొమ్ము! నీ బిడ్డలు నీ కొఱకు నిరీక్షించు చున్నారు.

## 5. బూటీ గండము – బాబా అభయము

536. నానా సాహెబ్ రేంగ్లే ప్రసిద్ధ జ్యోతిష్కుడు. అతడొకతఱి నా దినమున 'బూటీకి' ప్రాణ గండము కలదని చెప్పెను. తరువాత వారిరువురు బాబాదగ్గర కేగిరి.

సా. బా: నానా యేమి చెప్పుచున్నాడు! నీకు మృతి ఆసన్నమైనదని తెలుపుచున్నాడా? ఏమి? మనము భయపడవలసిన పనిలేదు. తాకుము! తాకుము! నీ వెట్లు తాకి చంపుదువో నేను చూచెదను గాక!

ఆ తరువాత 'బూటీ' మల విసర్జనమునకు వెళ్ళెను. అచట నొక సర్పముండెను. సేవకుడు దానిని జూచి ఒక రాతిని జేకొని పైకెత్తెను. 'దాని కంటె ఒక కర్రమేలు, క్షేమకరము' - అని, బూటీ అనెను. సేవకుడు కర్ర తెచ్చులోపల ఆ సర్పము వెడలిపోయెను.

'మృత్యుదేవత రానూ వచ్చినది. ప్రాణాపాయము గలిగింపక పోనూ పోయినది'.

## 5. బాబా – భక్తుల ఆరోగ్య విషయమై ఆలోచన – బాలషింపి

537. ఆదరించు వారెవ్వరు లేక మిక్కిలి వ్యాధిగ్రస్తుడై బాట ప్రక్కన పడియున్న 'బాలషింపి'ని బాబా చూచెను. బాబా నిత్యము భిక్షించు గృహములలో నాతని గృహము ఒకటి. అతని కుటుంబమునెడ బాబాకు మిక్కిలి ఆదరము కలదు. 'నింగోను'లో నున్న నానాసాహెబ్ డేంగ్లేదగ్గఱకు వెళ్ళుమని బాబా బాలషింపితో చెప్పెను. ఆ సమయమున నానాసాహెబ్ స్వప్నమున బాబా పొడమి 'నీ దగ్గఱకుజేరు 'బాలషింపి' విషయమై త... శ్రద్ధ తీసికొనుము' - అని ఆదేశించెను. కావున బాలషింపి అతని దగ్గఱకు వెళ్ళగా డేంగ్లే అతనిని మిక్కిలి ఆదరముతో పోషించెను.

### బాబా – కుష్ఠ రోగులయెడ ఆదరణము

538-(ఎ) సా. బా: భీమాబాయి? ఈ కుష్ఠ రోగియైన కాంతను నీ యింటికి గొనిపోయి పోషింపుము.

భీమాబాయి : బాబా! ఆమె కుష్ఠ రోగి.

సా.బా: దానిని లెక్కింపకుము. అయిన నేమి? ఆమె నా సహోదరి. ఆమెను నీ యింటికి గొనిపొమ్ము!

భీమాబాయి ఆ కుష్ఠ రోగిని తన యింటికి పిలుచుకొనిపోయి ఒక నెల రోజులు పోషించెను. అటుతర్వాత ఆ రోగి మృతి నొందెను.

(బి) సా.బా: (బాలాజి పటేల్ - నివాస్కర్‌తో) బాలా! నీ వింటికి పోవలదు. ఇచట నుండి ఈ డగ్డుభావ్‌ను (ముస్లిమ్ కుష్ఠురోగిని) పోషింపుము.

బాబా ఆజ్ఞ ననుసరించి బాలా ఆ కుష్ఠ రోగి మరణించువరకు ఒక నెల దినములు పోషించెను.

## 6. సహాయములు – సంతతి ననుగ్రహించుట

### (ఎ) డి. యస్. రసానే

539. దామోదర్ – సావబ్రాం - రసానే - మొదటి భార్యయందు

సంతానము కలుగని కారణమున మఱియొక భార్యను చేపట్టెను. కాని ఆమెయందు సంతతి కలుగలేదు. అతని జాతకమున జన్మలగ్నమునకు పంచమస్థానమున పాపగ్రహముండెను. గ్రహములతనికి ప్రతికూలములుగ నుండెను. కాని, అతనికి బాబాయందు గాఢవిశ్వాసము కలదు. అతడు షిర్డికి వెళ్ళినపుడు బాబా అతని కొఱకు నిరీక్షించు చుండెను. అతనికి 4 మామిడిపండ్లనిచ్చుచు –

సా. బా: దామియా! ఈ పండ్లనిపుడు తీసికొని పొమ్ము. వీనిని తిని చావుము.

దామియా భయ చకితుడయ్యెను. సంతతి బడసి, సంసారమగ్నుడగుట ఆధ్యాత్మిక మృతియే - యని, అతడు గుర్తించినవాడు కాడు.

సా. బా: ఈ పండ్లను నీవు తినవలదు. నీ భార్యకు వీనినిమ్ము!

దామియా : ఏ భార్యకు?

సా. బా: నీ రెండవ భార్యకు. ఆమెను ఈ పండ్లను దిననిమ్ము, ఆమెయందు ఇరువురు పుత్రులు జనింతురు. మొదటి బిడ్డకు 'దౌలత్ షా' - అని, రెండవ బిడ్డకు 'తానాషా' - అని పేర్లు పెట్టుము.

(ఆ తరువాత) అతనికి ఎనమండుగురు బిడ్డలు జనింతురనియు బాబా తెలిపెను. ఆ విధముగనే జరిగెను. దామియాకు మొదట ఇరువురు కొమరులు కలిగిరి. అతడు మొదటి బిడ్డ జనించినపుడా బిడ్డను బాబాదగ్గఱకు గొనిపోయి "బాబా! ఈ బిడ్డకేమి పేరు పెట్టుమందువు? అని అడిగెను".

సా. బా: నేను నీకు తెలిపినది మరచితివా? నీ నోటు పుస్తకములో 3వ పేజీలో వ్రాసికొంటివి. ఈ బిడ్డకు 'దౌలత్ షా' - అను పేరు పెట్టుమని నేను చెప్పలేదా?

(గమనిక : ఇతడు, దౌలత్ షా నానాసాహేబ్ రసానే - షిర్డి సాయీ సంస్థానమునకు ధర్మకర్త).

(బి) రావ్‌బహద్దూర్. హెచ్. వి. సాతే

540. హెచ్. వి. సాతే డిప్యూటి కలెక్టరు. 50వ సంవత్సరమున

భార్యా వియోగము కలిగెను. అతనికి ఇరువురు కుమార్తెలు మాత్రము కలరు. మగ సంతానము లేదు. పురుష సంతతికొఱకు మఱల వివాహము చేసికొన నతడు మిక్కిలి సందేహించుచుండెను. 1904 న అతడు మామ్లత్‌దారుతో కలిసి షిర్డికి వెళ్ళెను.

మామ్లత్‌దార్ : బాబా! సాహెబ్‌నకు పురుష సంతతిలేదు.

సా బా: సాహెబ్ వివాహమాడిన భగవానుడు ఇతనికి కుమారుని ప్రసాదించును.

ఆ విధముగ బాబా వలన అభయము పొంది సాతే మరల వివాహమాడ సిద్ధపడెను. మరుసటి సంవత్సరమున దాదా కేల్కారు తన కుమార్తెను సాతేకు ఈయదలచెను. కాని సాతే బాబాసలహా తీసికొన గోరెను. శ్యామా - దాదా కేల్కారు ఆ కన్యను బాబాదగ్గఱకు వెంటగొని వెళ్ళగ బాబా ఆ కన్యనొసట కుంకుమను పెట్టుచు "ఈ బిడ్డను అహమ్మదాబాదునకు (హెచ్. వి. సాతే నివసించుచోటు) పంపుడు" - అనెను.

హెచ్. వి. సాతే - ఆ కన్యను 1906న పరిణయమాడెను. తరువాత 6 సంవత్సరములలో ఇరువురు కుమార్తెలు మాత్రము జనించిరి. 1912న దాదా కేల్కారు సతీసమేతముగ బాబానుజేరి మ్రొక్కి "బాబా! మాకు దౌహిత్రుని జూచు భాగ్య మెప్పటికి? - అనెను.

సా. బా: నేను అల్లాను ప్రార్థించుచున్నాడను. నా ప్రార్థనము మన్నించును.

[1913 నందు సాతేకు కుమారుడు జనించెను. 1940 (ఈ గ్రంథ రచన) కాలమునకు అతడు మంచి ఆరోగ్యమున నున్నవాడు]

(సి) సపత్నేకర్.

541. సపత్నేకర్ : అనునతడు న్యాయశాస్త్ర విద్యార్థి. న్యాయశాస్త్ర పట్టపరీక్షకు సరియగు పరిశ్రమ లేకయే ఎట్లు విజయము పొందగలవు? - అని తన తోడి విద్యార్థి నతడు ప్రశ్నించెను. తన విద్యా పరిశ్రమయందెట్టి కొఱతలున్నను తనకు తప్పక విజయము కలుగునని సాయిబాబా అభయ ప్రదానముపై నాధారపడియున్న వాడనని ఆ మిత్రుడు సమాధాన మిచ్చెను.

అంతట సపత్నేకర్ ఆ మిత్రుని, సాయిబాబాను గూడ అవహేళనము చేసెను. ఆ పిదప పరీక్షాఫలితములు ప్రకటనమై బాబా అభయ ప్రదానమును యథార్థము గావించినవి. ఏమైనను ఆ పరీక్షలో తన మిత్రుని విజయమొక "గ్రుడ్డివేటు"-గ పేర్కొని యింకను బాబాయందు నిరాదరణ బుద్ధినే వెలిబుచ్చెను. ఆ సపత్నేకర్ అకల్కోటయందు న్యాయవాదిగ బనిచేసెను. పది సంవత్సరములు గడచిన పిదప తన ఏకైక సుతుని గోల్పోయెను. అతని అంతరాత్మ అతని బాధింప దొడగెను. బాబాను సందర్శించి, క్షమాపణము జెప్పుకొన దలచెను. అతడు షిర్డికిజేరి బాబాకు ప్రణమిల్లెను.

"చల్ - హట్" (వెడలి పొమ్ము!) కొంత తడవు వేచి మరల బాబాకు ప్రణమిల్లెను.

సా. బా: ఇక్కడనుండి వెడలి పొమ్ము.

సపత్నేకర్ షిర్డి విడిచి యింటికి వెళ్ళెను.

ఒక సంవత్సరము గడచినపిదప బాబా సపత్నేకర్ భార్య స్వప్నమున గోచరించి, ఆ దంపతులను తన దగ్గఱకు రమ్మని ఆహ్వానించెను. ఈ సమయమున సపత్నేకర్ తన పూర్వద్వేష ప్రవర్తనమునకు క్షమాపణము అతి వినయమున దెలుపుకొనెను. అంతట బాబా వివిధ కాలములందు వివిధ ప్రదేశముల జరుగుచున్న విషయములన్నియు తాను గుర్తించుచునేయున్న వాడని సపత్నేకర్ తెలిసికొనునట్లు అతని వృత్తాంతమంతయు స్వీయ వృత్తాంతముగ అతని ఎదుటనే ఒక గొల్లపడతితో జెప్పెను. మఱియు ఆ గొల్ల పడతితో –

సా. బా: (సపత్నేకరును చూపుచు) ఈతడు తన పుత్రుని నేను చంపితినని నన్ను నిందించుచున్నాడు. క్రమ్మఱ నేనా జీవాత్మనే ఈతని సతీ గర్భమున జేర్చుదును.

బాబా అంతట సపత్నేకర్ వైపునకు దిరిగి అతని మస్తకమున తన హస్తమునిలిపి "నీ ఆశయ మతిశీఘ్రముగ ఫలించును" - అని ఆశీర్వదించెను.

సపత్నేకర్ పరమానంద భరితుడయ్యెను. బాబా తన అంతర్జ్ఞానము

నంతకంత కధికముగ ప్రకటించినకొలది అతనికి బాబాయందు గాఢవిశ్వాసము పొడమకొనెను

ఉదా : సపత్నేకర్ సతికి గలుగనున్న వ్యాధిని గూర్చి దానికి గావింపదగు చికిత్సనుగూర్చి బాబా ముందుగ దెలిపినాడు. స్వానుభవమున నిట్టి విషయములను గుర్తింపజాలిన సపత్నేకరునకు విద్యార్థి దశలో వలె బాబాయందు అవిశ్వాసము ఎన్నటికిని పొసగబోదు. ఆ దంపతులు సెలవు తీసికొను సమయమున బాబా సపత్నేకరునకు కొబ్బరికాయను ప్రసాదించి "దీనిని నీ భార్య పైటకొంగున నుంచుకొని ఆనందమున వెళ్ళుడు!" - అని ఆశీర్వదించెను.

12 నెలలలో నతనికి పుత్రుడు జనించెను. ఆ దంపతులు తమ సుతుని బాబాదగ్గఱకు గొనివచ్చిరి.

(బి) ఔరంగ బాద్కర్‌సతి.

542. షోలాపూర్ నివాసి - సఖారాం ఔరంగబాద్కర్ రెండవ వివాహము చేసికొనినను సంతతి కలుగలేదు. 27 సంవత్సరములు వారు కాపురము చేసిరి. ఆ సతి షిర్డికిజేరి శ్యామాద్వారా బాబా అనుగ్రహము పడయగోరెను. బాబా సంతోషముగ నున్న సమయమున బిలుతునని అంతవరకు మసీదు దగ్గర నుండుమని శ్యామా ఔరంగబాద్కర్‌సతికి జెప్పెను. బాబా భోజనానంతరము చేతులు కడిగికొనుటకు శ్యామా నీరు పోసెను. బాబా చేతులు తుడిచికొని శ్యామా బుగ్గనుపట్టి మెలియపెట్టెను.

శ్యామా : (కోపము నటించుచు) ఏమి? దేవా! నా బుగ్గను మెలిపెట్టుట నీకు తగునా!

సా. బా: నీవు నాతోడనున్న 72 జన్మములనుండియు నిన్నింత వరకెప్పుడు బుగ్గ మెలిపెట్టి ఎఱుగను. నిన్ను తాకుటకు ఇప్పటికైనను సమ్మతింపవా?

శ్యామా : దేవా! మేము పదార్థములను (స్వర్గము - విమానములు మొదలగునవి) మాకు ప్రసాదింప దేవుని కోరుదుము.

సా. బా: అవును. వాస్తవముగ దానికొఱకే నేను వచ్చితిని.

అంతట బాబా తన గద్దెపై కూర్చుండెను. శ్యామా ఆ కాంతను పిలిచెను. ఆమె వచ్చి బాబాకు ప్రణమిల్లి, కొబ్బరికాయ, అగరవత్తులు సమర్పించెను.

బాబా ఆ ఎండిన కొబ్బరికాయను చేతబట్టి కదలించెను. లోపల ఎండిన కొబ్బరి కదలి ధ్వనించెను.

సా. బా: (కొబ్బరికాయను దోసిటబట్టి కదలించుచు) శ్యామా! ఇది లోపల దొరలుచున్నది. అది ఏమి పలుకుచున్నదో తెలిసికొనుము!

శ్యామా : ఈ కాంత తన గర్భములో బిడ్డ ఆ విధముగా దొరల వలయునని ప్రార్థించు చున్నది. అట్టి ఆశీస్సులతో ఆ నారికేళమును ప్రసాదింపుము!

సా. బా: ఆమె కిచ్చిన కొబ్బరికాయ బిడ్డగా మారునా! అట్టి ఆలోచనలు గల మనుష్యులెంత అవివేకులు!

శ్యామా : దేవా! నీ ఆశీః ప్రభావమును, ఆ నారికేళమును నే నెఱుగుదును. ఆ కొబ్బరికాయను ఆశీస్సులతో ప్రసాదింపుము!

అటుల ఇరుమారు - ముమ్మారు శ్యామా బాబాను ప్రార్థించెను.

సా. బా: ఆమెకు సంతానము కలుగును.

శ్యామా : కాని, ఎప్పుడు?

సా. బా: 12 నెలల లోపల.

అంతట ఆ కొబ్బరికాయను పగులగొట్టి సగము ఆ కాంతకు బాబా ప్రసాదించెను.

శ్యామా : అమ్మా! ఈయన మాటలను వినినావు కదా! నీకు 12 నెలలలో సంతతి కలగకున్న ఒక కొబ్బరికాయ ఈయన తలపై పగులగొట్టి, యీ మసీదు నుండి, ఈయనను వెలుపలకు నీడ్చివైచెదను. అటుల కావింపనా- నన్ను 'మాధవరావు' - అని పిలుచుకొనను.

సంవత్సరము లోపల ఆమెకు కుమారుడు కలిగెను. ఆ బిడ్డను 5వ నెలలో బాబాదగ్గఱకుగొనివచ్చిరి. తండ్రి బాబాకు 500 రూపాయలు సమర్పించెను. ఆ ద్రవ్యముతో బాబా అశ్వము (శ్యామకర్ణము) నకు ఒక కొట్టము నిర్మింపబడినది.

### (ఇ) చింతామణిరావు

534. సా. బా: (మహల్సాపతితో) ఆతడు మరల వివాహము చేసికొనిన ఒక పుత్రుడు, ఒక పుత్రిక జనింతురని అతనితో(చింతామణిరావుతో) చెప్పుము.

చింతామణిరావు తిరిగి వివాహము చేసికొనెను. ఒక కుమారుడు, ఒక కుమార్తె మాత్రమే జనించిరి.

### (ఎఫ్) మహల్సాపతి

544. మహల్సాపతికి స్త్రీ సంతతి మాత్రమే కలదు. అటులయ్యు నతడు బ్రహ్మచర్య నిష్ఠ గలిగి బాబా వెంట మసీదునందు చావడియందు నిద్రించువాడు.

సా. బా: భగత్! వెళ్ళి నీ యింట నుండుము. నీకు సుతుడు జనించును. సుతుడు చూతఫలము (మామిడి పండు), సుత తింత్రిణీ ఫలము. (చింతకాయ)

భగత్ మహల్సాపతి గోకులాష్టమినాడు ఇంటికి వెళ్ళెను. మరల గోకులాష్టమిలోపల అతనికి పుత్రుడు పుట్టెను.

### (జి) రతన్జీసేత్

545. (నైజామ్ రాష్ట్రములోని) నాందేడ్ నివాసి 'రతన్‌జీ-సపూర్జీ-వాడియా' కు సంతానము లేదు. ఒకనాడు దాస్‌గాణూ మహారాజు - మౌలీ సాహేబ్ (మౌలానా) లకు రు. 3-14-0 లు వెచ్చించి అల్పాహార విందు కావించి, సంతాన ప్రాప్తికి బాబా ఆశీస్సుల బడయగోరి షిర్డికి వెళ్ళి బాబాకు మ్రొక్కెను.

సా. బా: నీ విదివరకు రు. 3-14-0 లు యిచ్చినావు. నా కిపుడు రు. 2-2-0 లు దక్షిణ నిమ్ము.

రతన్జీ ఆ పైకము నిచ్చెను. కాని, తానంతవరకు బాబాను దర్శింపక యేమియు ధనము పంపని వాడగుటచే తాను బాబాకు రు. 3-14-0 లు సమర్పించుట యెట్లు పొసగెనా యని ఆశ్చర్యపడెను.

సా. బా: నీ హృదయ కామితమును భగవాను డనుగ్రహించును.

బాబా ఆశీస్సులు బడసి రతన్జీ తిరిగి యింటికి వెళ్ళెను. బాబా లోగడ ధనము స్వీకరించుట మౌలానా రూపమున బాబా స్వీకరించినాడని దాస్‌గాణూ మహారాజు విశదపరచెను. రతన్జీ తన లెక్కలను చూచుకొనెను. మౌలానా మౌలీసాహెబునకు అల్పాహార విందునకై తాను వెచ్చించినది సరిగ రు.3-14-0లు అగుట అతడు గుర్తించెను - తరువాత బాబా అనుగ్రహమున రతన్జీకి పుత్రుడు జనించెను.

(హెచ్) నారాయణ గోంద్ సింధే

నా. గో. సింధేకు ఏడుగురు పుత్రికలు జనించిరి. పురుష సంతానము లేదు. అతని ప్రారబ్ధ కర్మము ననుసరించి పుత్ర సంతాన ప్రాప్తిలేకున్నను అతడు దత్తస్వామిని ప్రార్థించిన కారణమున బాబా అతనికి సుతుని ప్రసాదించిన విషయము 1903లో బాబా తెలిపినాడు. (చూ. 399)

545-ఎ. బిడ్డలకు బాబా దీర్ఘాయువును ప్రసాదించుట

సా. బా: జి. జి. నార్కేకు బిడ్డలు కలరా?

భక్తుడు : బాబా! అతని బిడ్డలు మిక్కిలి బాల్యముననే మృతి నొందిరి.

సా. బా: అల్లా అనుగ్రహించును.

ఆ తరువాత నార్కేకు నలుగురు బిడ్డలు కలిగిరి. అందఱు దీర్ఘాయువు గలవారైరి.

(గమనిక : బాబా, 'బడావే' సతినిగూడ యీ విధముగ అనుగ్రహించినాడు).

సా. బా: నీ విదివరకు రు. 3-14-0 లు యిచ్చినావు. నా కిపుడు రు. 2-2-0 లు దక్షిణ నిమ్ము.

రతన్జీ ఆ పైకము నిచ్చెను. కాని, తానంతవరకు బాబాను దర్శింపక యేమియు ధనము పంపని వాడగుటచే తాను బాబాకు రు. 3-14-0 లు సమర్పించుట యెట్లు పొసగెనా యని ఆశ్చర్యపడెను.

సా. బా: నీ హృదయ కామితమును భగవాను డనుగ్రహించును.

బాబా ఆశీస్సులు బడసి రతన్జీ తిరిగి యింటికి వెళ్ళెను. బాబా లోగడ ధనము స్వీకరించుట మౌలానా రూపమున బాబా స్వీకరించినాడని దాస్గాణూ మహారాజు విశదపరచెను. రతన్జీ తన లెక్కలను చూచుకొనెను. మౌలానా మౌలీసాహెబునకు అల్పాహార విందునకై తాను వెచ్చించినది సరిగ రు.3-14-0లు అగుట అతడు గుర్తించెను - తరువాత బాబా అనుగ్రహమున రతన్జీకి పుత్రుడు జనించెను.

### (హెచ్) నారాయణ గోంద్ సింధే

నా. గో. సింధేకు ఏడుగురు పుత్రికలు జనించిరి. పురుష సంతానము లేదు. అతని ప్రారబ్ధ కర్మము ననుసరించి పుత్ర సంతాన ప్రాప్తిలేకున్నను అతడు దత్తస్వామిని ప్రార్థించిన కారణమున బాబా అతనికి సుతుని ప్రసాదించిన విషయము 1903లో బాబా తెలిపినాడు. (చూ. 399)

### 545-ఎ. బిడ్డలకు బాబా దీర్ఘాయువును ప్రసాదించుట

సా. బా: జి. జి. నార్కేకు బిడ్డలు కలరా?

భక్తుడు : బాబా! అతని బిడ్డలు మిక్కిలి బాల్యముననే మృతి నొందిరి.

సా. బా: అల్లా అనుగ్రహించును.

ఆ తరువాత నార్కేకు నలుగురు బిడ్డలు కలిగిరి. అందఱు దీర్ఘాయువు గలవారైరి.

(గమనిక : బాబా, 'బడావే' సతినిగూడ యీ విధముగ అనుగ్రహించినాడు).

మనెను. ఆమె నిరాకరించెను. కుపితుడైన భర్త (సాతే) బండివాని చేతిలోని కొరడా లాగికొని భార్యను దండించుటకా కొరడా పైకె త్తెను. వెంటనే మేఘుడు - (మేఘశ్యామ) పరుగున వచ్చి –

మేఘ : బాబా నిన్ను వెంటనే ద్వారకామాయి మసీదునకు రావలసినదిగా ఆదేశించు చున్నాడు.

సాతే ఆ కొరడాను క్రింద పాఱవైచి, బాబా దగ్గఱ కేగెను.

సా. బా: ఏమి? ఆ విషయము. ఏమి జరిగినది? నీ భూమి అచటనే కలదు. వెళ్ళి దానిని చూడవలసిన అవసరమేమి కలిగినది?

హ. వి. సాతే తన భార్యను కొరడాతో కొట్టదలచిన ప్రయత్నమునకు సిగ్గుపడెను. తనయెడ, తన కుటుంబమునెడ నిరంతరము జాగృతితో ప్రసరించుచున్న బాబా కరుణార్ద్ర దృష్టిని దలంచుకొని సాతే మిక్కిలి సంతోషించెను.

## 8. వ్యాపారమున సహాయము

### (ఎ) డి. యస్. రసానే

548. దామోదర్ - సావల్రాం - రసానే బొంబాయిలోని ఒక దలారి ద్వారా ప్రత్తి చట్టావ్యాపార సంబంధమైన బేరము కలిగెను ఆ దలారి ఆ చట్టా వ్యాపారమున లక్షలకొలది లాభము కలుగునని రసానేకు తెలిపెను ఈ విషయమున బాబా సమ్మతి తీసికొనుమని రసానే - షిర్డిలోని శ్యామాకు ఉత్తరము వ్రాసెను. శ్యామా ఆ ఉత్తరమును బాబాదగ్గఱకు గొనిపోయెను. దానిని తెఱచి చదువు పూర్వమే –

సా. బా: దామియా- అకాశము నందుకొనజూచు చున్నాడు. దైవము ప్రసాదించినది నిలుపుకొని దానిలో సంతృప్తి నొందుటలేదు. దామియా మతి భ్రమించు చున్నది. అతని ప్రస్తుత స్థితి యెట్టి లోటులేదని వ్రాయుము. అతని కిపుడుగల సగమురొట్టె చాలును. లక్షలను గూర్చి ఆందోళన చెందవలదని తెలుపుము.

అంతట దామియా ఆ చట్టా వ్యాపారము చేయవలయునని అందు లభించు లాభములో బాబాకు భాగమీయ వలయునను తలంపున స్వయముగ షిర్డికి వెళ్ళి బాబాను దర్శించి, బాబా పాదములొత్తుచుండెను.

సా. బా: (బిగ్గఱగ) దామియా! నేను దేనిలో లేను. అనగా - నా కీ సంసారమున దేనితో సంబంధము (లాభములు పంచుకొనుట మొదలగు వానితో సంబంధము) కల్పించుకొనెను.

(కావున 'దామియా' ఆ ప్రయత్నము మానెను).

తరువాత కొంత కాలమునకు దామియాకు ఒక తలంపు కలిగెను. ధాన్యమును పెద్ద మొత్తములుగ కొని, నెలలు, సం॥ములు నిలువచేసి, ధర హెచ్చిన పిదప అమ్మవలయునను ఉద్దేశము కలిగెను. దామియా బాబాదగ్గఱకు వెళ్ళి 'బాబా! నేను ధాన్య వ్యాపారమును చేయుదునా?' అని అడిగెను.

సా. బా: వలదు. నీవు 5 శేర్లు చొప్పున కొని 7 శేర్లు చొప్పున అమ్మెదువు.

కాని కొన్ని వారముల వరకు ధాన్యము ధర హెచ్చు చుండెను. బాబా భవిష్యత్సూచన లసత్యములా - యను నట్లుండెను. కాని ఒకటి, రెండు నెలల తరువాత - శ్రావణమున అంతట వర్షములు సమృద్ధిగ కురిసెను. ధాన్యము ధరలు తలవని తలంపుగ తగ్గుచు నటుల చాల కాల ముండెను. ధాన్యము నిలువ చేసిన వర్తకులు మిక్కిలి నష్టముల పాలైరి. బాబా, దామియాను అట్టి దుర్గతి నుండి తప్పించెను.

(బి) బయ్యాజీ పటేల్

549. (1) సంవత్సరముల తరబడి బాబా బయ్యాజి - అప్పాజి - పటేలునకు నిత్యము 4 రూపాయలు చొప్పున నిచ్చుచుండెను.

సా. బా: ఈ ధనము నెవరికి అప్పు నీయవలదు. ఇతరులకు దాన ధర్మములు చేయవలదు. నీ సంసారమున నిత్య భోజనాదులకు వ్యయ పెట్టవలదు.

ఆ ధనముతో అతడు భూమి కొనవలయునని బాబా అభిప్రాయము. ఆ విధముగ బయ్యాజి ఆ ధనముతో 84 ఎకరముల భూమిని కొని యిప్పటికిని నిలుపుకొనినాడు.

(2) చెఱకు పంట పండించుట అచట రైతుల కాచారమైనది. గోదావరి లోయ యందు ప్రతి కృషీవలుడు చెఱకు పైరు వేయుచుండును.

బయ్యాజి : బాబా! నేను చెఱకుపైరు వేయుదునా?

సా. బా: వలదు.

కాని, ఇతరులు కావించు పనిచూచి చెఱకులో గొప్ప లాభముల గడింపవలయునను తలంపుతో బాబామాటలను పాటింపక బయ్యాజి చెఱకు నాటెను. పర్యవసానమున చెఱకు తోటలకు పెట్టిన పెట్టుబడి 400 రూపాయలు నష్టమగుటయేగాక, ఇతరములగు మెట్ట పైరుల వలన వచ్చు ధాన్యము-పశుగ్రాసము మొదలగు వానిని కోల్పోయినాడు.

(సి) రావ్ బహద్దూరు – యస్. బి. ధుమాల్

550. నాశిక్‌లో పబ్లిక్ ప్రాసిక్యూటర్ - (ప్రభుత్వపక్ష న్యాయవాది) ఉద్యోగమునకు చేరవలసినదిగా ధుమాల్‌నకు పిలుపు వచ్చెను. బాబా అంగీకారము కొఱకు ధుమాల్ షిర్డిలోని శ్యామాకు ఉత్తరము వ్రాసెను.

సా. బా: ఆ క్రొత్త ఉద్యోగము అతడంగీకరింపనేల? పాత పదవియే చాలును.

యస్. బి. ధుమాల్ ఆ ప్రభుత్వ న్యాయవాది పదవిని నిరాకరించెను. అతని ఆదాయమున కెట్టి కొఱతయు కలుగలేదు.

9. భక్తుల ప్రేమకులోగి బాబా తన పూజకు సమ్మతించుట

551. భక్తులు తన భౌతిక తనువును పూజించుట బాబాకు మొదటి నుండియు నిష్టములేదు. వారించినాడు. కాని తీవ్రమైన భక్తిగల మహల్సాపతి బాబాపూజను ప్రారంభించెను. బాబా కాదనలేకపోయెను. నా. గో. చందోర్కరు కుమారుడు 'బాపు' - 4 ఏండ్ల బిడ్డ దీనిని కొనసాగించెను. ఆ బిడ్డవలె అందఱు ఆ స్వాతంత్ర్యమును చూఱగొన దొడగిరి. అప్పటికిని బాబా తన ముఖమున గంధముతో అడ్డముగ త్రిపుండ్రములను పెట్టుటకు సమ్మతించలేదు. కాని డాక్టర్ పండిట్ వచ్చి బాబా ముఖమున గంధముతో త్రిపుండ్రములను అడ్డముగ పెట్టినాడు. బాబా ప్రశాంతముగ నోర్చికొనినాడు.

దాదాకేల్కార్ : బాబా! ఏమిది? చందన తిలకమును నిరాకరించువాడవు నీ విపుడు సమ్మతించితివేల?

సా. బా: ఈ పండిట్ తన బ్రాహ్మణ గురువు ధోపేశ్వర్‌లోని కాకా మహారాజుగ నన్ను మనసున భావించి, తన గురువునకు గంధము, తిలకము దిద్దినట్లు నా నుదుటనుంచినాడు. కావున నేను నిరాకరింప జాలనైతిని.

తరువాత అబ్దుల్‌రంగారి (ముస్లిం) వచ్చి బాబానిట్లు ప్రశ్నించెను.

అ. రం: ఏమిది? నీ నుదుట గంధ మలదబడినదే! ఇది మన ఆచారము కాదు.

సా. బా: "జైనాదేశ్ - వైసొవేష్" - మన పరికరముల ననుసరించి మనము వర్తింపవలె. ఈ హైందవులు వారిదైవముగ నన్ను పూజించుచున్నారు. వారి మనస్సును నేను బాధింపనేల? వారి నటుల కావించుటకు సమ్మతించితిని. నేను భగవానుని భక్తుడనే.

బాబా – గురుపూర్ణిమ జరుప నియమించుట.

552. 1909 నుండి బాబా నిత్యసమిష్టి ఆరతిపూజలు ప్రారంభమైనవి. కాని గురుపూర్ణిమ (ఆషాఢశుద్ధపూర్ణిమ) నాడు బాబా ప్రత్యేక పూజారాధనలు జరుపు ఆచారములేదు. 1909 గురుపూర్ణిమనాడు బాబా స్వయముగ దాదాకేల్కారును పిలువనంపెను. "ఈ దినము గురుపూర్ణిమయని నీ వెఱుగవా? పూజా ద్రవ్యములగొనివచ్చి గురుపూజ గావింపుము"-అనెను. ఆ దినమున గురుపూజ కావింపబడినది. అది మొదలు బాబా భక్తులందఱు గురుపూర్ణిమనాడు ప్రత్యేక గురుపూజ గావించు ఆచారము ప్రారంభమై నేటికిని జరుపబడుచున్నది.

కాని, శివరాత్రినాడు అర్ధరాత్రమున రహస్యముగ బాబాపూజ జరుపుచున్న హ. వి. సాతేను బాబా వారించెను.

10 భక్తులయెడ బాబా జాగరూకత

(ఎ) నా. గో. చందోర్కర్.

553. నా. గో. చందోర్కర్ - పండరిపురమునకు బదిలీచేయబడి, అచట ఉద్యోగములోజేరు పూర్వము బాబా సెలవు తీసికొన షిర్డీకివచ్చుచుండెను. బాబా అచటజేరిన భక్తుల - మహల్సాపతి, కాశీరాం, అప్పా సింధిలను సంబోధించుచు నిట్లనెను. మనము నలువురము భజనచేయుదము. పండరిద్వారము చక్కగ తెరువబడినది. మన మానందముతో భజన చేయుదము. బాబా గేయమునిట్లు ప్రారంభించెను.

పండరికిని దారి పట్టి పోవుదుము
ఉండు దమిక యందె యుండు వారలము
చక్కగ నట నివాసంబు జేయుదుము
అక్కడ మన ప్రభు వలరారుజిరము.

వారు ఈ కీర్తనము గానము చేయుచుండగా నానాసాహెబ్ చందోర్కరు మసీదుజేరెను.

554. తానాప్లీడరు 'జోషి' తమ్ముడు చిన్నజోషి షిర్డికి వెళ్ళి బాబాను దర్శింపదలచెను. కాని వెళ్ళుటకతనికి సాధ్యపడలేదు. కొన్ని దినముల తరువాత ఒక కొంకణాస్థ బ్రాహ్మణుడు బొంబాయికి వెళ్ళుటకు బాబా సెలవు కోరుచుండెను.

సా. బా: (కొం. బ్రా. తో) ఈ ఉధిపొట్లము దీసికొనివెళ్ళి, నీవు ప్రియాణముచేయు రైలులో నీ దగ్గఱనుజేరి, కూర్చుండుటకు కొంచెము 'జాగా' నీయుమని కోరునతనికి దీనినిమ్ము.

కొం. బ్రా: (ఆ ఉది పొట్లము తీసికొని) నా కెవరు సందర్భ పడని యెడల దీనిని తిరిగి మీకు పంపుదును.

సా. బా: నీ వా మనుష్యుని జూతువు.

అంతట ఆ బ్రాహ్మణుడు కోపర్గామునుండి బొంబాయికి రైలులో బయలుదేరెను. కల్యాణ్ స్టేషన్ వరకు నెవ్వరు తటస్థపడలేదు. కల్యాణ్ దగ్గఱ రైలుబండిలోని పెట్టెలు - ఈ బ్రాహ్మణుడున్న పెట్టె క్రిక్కిరిసి యుండెను. ఆ చిన్న జోషి యాతడున్న పెట్టెలోనికి కొద్దిగా జాగా నిమ్మని ఆ బ్రాహ్మణుని కోరెను. కొం. బ్రాహ్మణుడు కొంచెమెడమిచ్చి, ఆ ఉధి పొట్లమును అతని కొసంగెను.

555. 1915 అక్టోబరు 3వ వారమున సాయంత్రమున 5 గంటలకు కాకా మహాజని, తన యజమాని సేత్‌యొక్క కుమారుని గలిసెను.

సేత్‌కుమారుడు : నా తండ్రి తాను నాశిక్‌లో ఇంకా కొన్ని దినము లుండుమనునో - లేక - బొంబాయికి జేరుమనునో - బాబా ఆదేశమేమిటో తెలిసికొనుమని నాశిక్‌నుండి ఉత్తరము వ్రాసినాడు. కావున దయతో షిర్డికి వెళ్ళి బాబానడిగి తెలిసికొనుము.

కా. మ: హ. సీ. దీక్షిత్తు షిర్డిలో నున్నవాడు. ఆయనకు ఉత్తరము వ్రాసి బాబాఅజ్ఞను తెలిసికొందుము.

సేత్ కుమారుడు : వలదు వలదు. నీవు స్వయముగా వెళ్ళి బాబా ఆదేశమును తెలిసికొని రావలసినదిగా తండ్రిగారు వ్రాసినారు.

కా. మ: సరే - నేను వెళ్ళుదును.

ఆ సమయమున బాబా మసీదులో హ. సీ. దీక్షిత్తు మరి 24 గురు భక్తులతో నున్నవాడు.

సా. బా: (హ. సీ. దీక్షిత్తు వంకకు తిరిగి) అహెూ! ఏమి! ఆ విషయములు - వాదములు - ఆలోచనలు?

మఱునాడు కాకా మహాజని షిర్డికి వెళ్ళెను.

సా. బా: (కా. మ.తో) నీవు వచ్చి మంచిపని చేసితివి.

(దీక్షిత్ వైపునకు తిరిగి) నిన్న సాయంత్రం మీ విషయమై తలంచు చుంటిని గదా!

అంతట కా. మహాజని, హ. సీ దీక్షిత్తు ఇరువురు కలియబలుకుకొని, బాబా తన భక్తులను షిర్డియందు, బొంబాయియందు నొకే కాలమున నెట్లు జాగృతమై కనిపెట్టియున్నది గుర్తించిరి. (చూ. 9)

(బి) రావ్‌బహద్దూర్. యం. డబ్లుయు - ప్రధాన్ - తల్లి

556. సా. బా: (ప్రధాన్‌తో) నాకీ పార్శ్వమున మిక్కలిగ నొప్పి యేర్పడినది. 2 లేక 4 దినములలో తగ్గిపోవును.

బాబా పై మాటలు పలుకునపుడు ఆరోగ్యముగనే యున్నవాడు. ప్రధాన్ ఆ మాటలపుడు గ్రహింపలేకపోయెను అతడు బొంబాయిలోని తన యింటికి జేరగా తన తల్లికి పక్షవాతము సంబంధమగు నొప్పి తీవ్రముగ గలిగి 2, 4 దినములలో తగ్గినట్లు తెలిసికొనెను.

(సి) (మేనేజర్) సదాశివతార్కాడ్ — సేవకుడు

557. సా. బా: (తార్కాడ్ ఎదుట) నా కాలు నొప్పిగా నున్నది. కలబంద చీల్చి నిప్పుపై వెచ్చచేసి కాలిపై కాపుకాచిన అది తగ్గిపోవును.

అది తార్కాడ్ సేవకునకు కలిగిన (బోదెకాలు) నొప్పి, బాబా తెలిపిన ఆ ప్రక్రియ చేయగా నతని కాలునొప్పి తగ్గినది.

## (11) బాబా జాగృతి – భవిష్యత్ జ్ఞానము

### (ఎ) జి. జి. నార్కే – (చూ. 608)

558. 1916 న బాబా నిత్యహారతి వేళకు షిర్డిలో హల్వా రొట్టె తయారుచేసి పంపువాడు ప్లేగు వ్యాధిచే మరణించెను

సా. బా: (నార్కేతో) హల్వాయీ అంగడికి వెళ్ళి నైవేద్యము తీసికొని రమ్ము.

నార్కే : (అచటకువెళ్ళి హల్వాయీ భార్యతో) బాబా నైవేద్యమును పంపుమను చున్నాడు.

హ. భార్య : అటు చూడుము. ప్లేగు వ్యాధిచే మరణించిన నా భర్త కళేబర మదిగో - హల్వా ఆ అలమారలో నున్నది. నీ కిష్టమేని తీసికొని పొమ్ము.

జి. జి. నార్కే ఆ హల్వా నైవేద్యము స్వీకరించిన తనకు ఇతరులకు ప్లేగు వ్యాధి సోకునను భయముతో గడ - గడ వణకుచు ఆ హల్వా తీసికొని వెళ్ళి బాబా ముందుంచెను.

సా. బా: నీవు షిర్డికి దూరముగ నుండిన బ్రతుకుదు వనియు, షిర్డిలో నున్న మరణింతువనియు దలచుచుంటివా? అటులెన్నటికినికాదు. దైవ యోగమున ఎవరెవరు బ్రేటుపడవలసి యుందురో వారే బ్రేటుపడుదురు. ఎవరెవరు చావవలసి యుండెనో వారే చత్తురు. ఎవరెవరు లాలింపబడవలసి యుందురో వారే లాలింపబడుదురు. (చూ. 288, 608)

ఆ హల్వా నైవేద్య మందఱకు పెట్టబడెను. దానివలన నెవరికి ప్లేగు వ్యాధి కలుగలేదు.

### (బి) యస్. బి. ధుమాల్

559. ధుమాల్ – తాను నివసించు నాశిక్ పురమున ప్లేగు వ్యాపించి తన యింటిలో నెలుకలు చచ్చిపడుట గమనించెను. తన

గృహమును విడిచి దూరముగనున్న బంగళాలో చేరుట మంచిదేమో బాబా నడిగి తెలుపుమని ధుమాల్ షిర్డిలోని శ్యామాకు ఉత్తరము వ్రాసెను. బంగళాలో చేరుమని బాబా అనుమతి అందెను. కాని, బంగళాలో చేరిన రాత్రియే మంచముల౦ దొకదానిపైన చచ్చిన ఎలుక పడియుండెను. అంతట ఆ బంగళా విడిచి మరియొక తావునకు వెళ్ళుట తగునో, తగదో తెలుపుమని ఉత్తరముద్వారా ధుమాల్, బాబాను కోరెను. సమాధానము వచ్చువరకు అచటనే యుండెను. బంగళాలోనే యుండుమని సమాధానము వచ్చెను.

ఆ పిదప యిరుగుపొరుగు గృహములందువలె బంగళాలో నెల్లెడల సేవకుల నివాసమున బావియందు చచ్చిన ఎలుకలు కనబడెను. మరల ధుమాల్ బాబాకు జాబు వ్రాసి, సమాధాన మందుపూర్వమే బంగళాలోని తన సామానులు సర్దుకొని తిరిగి నాశిక్ పురమున తన యింటిలో చేరు తలంపున నింటి తలుపు తాళము తీయుచుండగ బాబా సమాధానము అందెను. 'ఇప్పుడున్న నివాసము మనమేల మార్చవలయును?' అని సమాధానము.

వెంటనే ధుమాల్ తిరిగివెళ్ళి బంగళాలోచేరి అచటనే నివసించెను. బాబా పరిరక్షణమున నున్న ధుమాలునకు, అతని కుటుంబమునకు ఎట్టి ఆపదలు కలుగలేదు.

559-ఎ. షిర్డీ గ్రామ జనులు : (అప్పా కులకర్ణి మృతి పిదప) బాబా! గ్రామములో కలరా వ్యాధి అతిభయంకరముగ వ్యాపించు చున్నది. మమ్ము రక్షింపుము.

సా. బా: భయపడ వలదు. ఏడుగురు మాత్రమే మృతి నొందుదురు. ఆ పిదప ఈ వ్యాధి అంతరించును.

## 12. బాబా – తన భక్తుల అధిపతి – యజమాని స్థానము వహించుట

### (ఎ) కాకా మహాజని

560 సా.బా: థాకర్ సే (సేత్) ఎట్లు కాకా మహాజని యజమాని కాగలడు? అతనికి పరమానందము ప్రసాదింపగల వేఱొక యజమాని కలడు.

(బి) అర్. బి. పురందర్ విషయము

561. ఒక భక్తుడు : అతడు (పురందర్) సెలవు అతిక్రమించి యిచట నుండిన యజమాని అతనిపై కఠిన చర్య తీసికొనును.

సా. బా: నేనే అతని యజమానిని.

562. భక్తుడు: రైలు అందుకొనుటకు నాకు సెలవు ప్రసాదింపుము. లేకున్న ఈ ఉద్యోగము నుండి తొలగింపబడును.

సా. బా: (నీకు నాకంటె) ఇక్కడ నున్నతాధికారి యెవడు లేడు. భోజనముచేసి సాయంత్రము వెళ్ళుము.

బాబాఆజ్ఞను చలింపని విధేయతతో పాటించుట అత్యంత క్షేమకర విధానముగ భక్తులెల్లరు గుర్తింపగలిగిరి.

13. అపరాధుల (నేరము కావించినవారి) యెడను బాబా కరుణ

563. 1915 దసరాలో ఒక దినమున –

సా. బా: (హ. సీ. దీక్షిత్తుతో) కాకా! మన దర్బారు నందు మంచి వారివలె చెడ్డవారును చేరుదురు. మనము నిష్పక్షపాత బుద్ధితో వారి నాదరించవలె - కాదా?

అపుడొక గుమాస్తా వచ్చి బాబా పాదముల ముందు సాగిలబడెను. అతడు తన యజమాని ధనము అపహరించిన కారణమున అతని బట్టుకొని తెచ్చుటకు వారంటు (అధికార పత్రము) జారీ చేయబడి యుండెను. మసీదు నందపుడాతని పై అధికారి యొకడు కలడు. తాను వెంటనే వెళ్ళి పోలీసులకు తెలుపవలదా? - అని అతడు తలంచెను.

బాబా అంతట వాస్తవమైన పేర్లుకాక (వాణి - తాలి) యితర పేర్లను పేర్కొనుచు ధనాపహరణము కావించుట - అతనిపై వారంటు మొదలగు వానిని గూర్చి పలికెను.

సా. బా: (ఆ గుమాస్తాతో) నీవు వెళ్ళి వెంటనే భోజనము చేయుము.

సా. బా: (పై అధికారితో) నీ విక్కడనే యుండుము!

సా. బా: (భోజనము చేసివచ్చి బాబాతో ఏకాంతముగ మాటాడిన ఆ గుమాస్తాతో) నీ విపుడు వెళ్ళిపొమ్ము.

సా. బా: (ఆ గుమాస్తాను పాటిపోనిచ్చి నందులకు తన పై అధికారులు తన్నునిందితురేమోయని భయపడుచున్న పై అధికారితో) నీవు భయపడుచుంటివా?

పై అధికారి : లేదు. బాబా!

పై అధికారికి 3, 4 రోజుల తరువాత షిర్డినుండి వెళ్ళుటకు బాబా అనుమతి నిచ్చెను. అతని పై ఉద్యోగు లాతని నిందింప లేదు. ధనాపహరణము చేసిన గుమాస్తా (బాబా బోధలను పాటించుటచే) స్వయముగ న్యాయాధికారుల యెదుటబడి తన నేరము ఒప్పుకొనెను. అతని యజమాని కఠిన శిక్ష విధింపుడని కోరని కారణమున ఆ గుమాస్తాను స్వల్పశిక్షతో న్యాయాధిపతులు విడిచిరి.

### 14. ప్రయాణములందు బాబా సహాయము

564. సా. బా: [హరిదాసు దా. గా. తో నున్న నానాతో] భోజనము చేసి రైలుకు వెళ్ళుడు.

[హరిదాసు [దా. గా.] బాబాయందు విశ్వాసములేని కారణమున భోజనము చేయకయే బయలుదేరి వెళ్ళెను. నా. గో. చందోర్కరు భోజనము చేసి రైలువచ్చు పూర్వమే స్టేషనుకు చేరుకొన గలిగెను].

నానా చందోర్కరు భోజనముచేసి మరల బాబా సెలవు తీసికొనిన పిదప బయలుదేరెను. ఇంత జాగుచేసినను ఆ బండి కొన్ని గంటలు ఆలస్యమగుటచే రైలు వచ్చువేళకు చేరగలిగినాడు.

### కోపర్గామునకు 'బేరే' ప్రయాణము

564-ఎ. 'గణేష్ - విష్ణు - బేరే' [వ్యవసాయశాఖ ఇన్స్పెక్టర్] దాస్‌గాణూతో కలిసి టాంగాపై కోపర్గామునకువెళ్ళి రైలు నందుకొనవలయునని బాబా సెలవు కోరెను.

సా. బా: త్వరపడుము. ఆలసింపకుము. నీవు స్టేషన్ జేరువరకు టాంగా నెక్కడ నాపనీయకుము!

ఆ విధముగ నిరువురు టాంగాపై షిర్డినుండి బయలుదేరిరి. రైలు వచ్చుటకింకను వ్యవధికలదు. కానవు ఇతర టాంగాలవాండ్రు 'బేరే' యున్న టాంగాను కొంచెముసేపు ఆపుమని కోరిరి. వారి మాటలను లెక్కింపక బేరే రైలువేళకు చాలముందుగనే కోపర్గామునకు క్షేమముగ జేరెను. తరువాత ఇతర టాంగాలు రైలువేళకు చేరికొనినవి. కాని ఆ టాంగాలను దారిదోపిడి దొంగలడ్డగించిరి. బాబా త్వరపెట్టిన కారణమపుడు బేరేకు విశదమయ్యెను.

565. సా. బా: (పురందర్‌తో) నాశిక్‌లో రెండు రోజులుండి వెళ్ళుము.

(ఆర్. బి. పురందర్ బిడ్డలకు జబ్బుచేసిన కారణమున నాశిక్‌లో 2 రోజులుండి వెళ్ళవలసి వచ్చినది).

566. సా. బా: (నాశిక్ - వెళ్ళదలచి, బి. వి. వైద్యతో)నాశిక్‌లో ప్లేగు వ్యాధికలదు. నీ బిడ్డలతో నింటికి తిరిగి వెళ్ళుము

567. సా.బా: (కోర్టుకు హాజరు కావలసినదిగా ఉత్తరువులందిన 'తాత్యా'తో) ఈ రోజున నీవు కోర్టుకు వెళ్ళవలదు. (తలవని తలంపుగ ఆ దినమున కోర్టు మూసివేయబడినది).

568. సా.బా: (తాత్యాతో) నీవు మార్కెటునకు వెళ్ళవద్దు. కాదా శ్యామాను వెంటదీసికొనిపొమ్ము.

శ్యామాను తోడుచేసికొనక తాత్యా ఒంటరిగ వెళ్ళెను. తీవ్రమైన నడుమునొప్పిచే నొక గుఱ్ఱము స్వాధీనము తప్పిపోయినది.

569. సా. బా: ఆంగ్లేయుడా! కోపర్గామునకు వెళ్ళవలదు.

ఆ ఆంగ్లేయుడు వెళ్ళెను. మార్గమధ్యమున బండినుండి క్రిందబడెను. తుదకు ఆస్పత్రిలో చికిత్సకొఱకు చేర్చబడెను.

570. సా. బా: (అప్పుడే షిర్డికిజేరిన కాకా మహాజనితో) నీ వెప్పుడు తిరిగి యింటికి వెళ్ళుదువు?

కా. మ: బాబా! నీ ఆజ్ఞయైనపుడు.

సా. బా: రేపు ఉదయము వెళ్ళుము.

కాకా మహాజని మఱునాడు ఉదయమే బయలుదేరి వెళ్ళెను. అతడు 'ఆఫీసు' చేరుసరికి అతని ఉనికి ఎంతయో అవసరమయ్యెను.

571. సా. బా: (బాబా అనుగ్రహమున ఉద్యోగమేదేని సంపాదించుకొనవలయునను ఆశతో అప్పుడే షిర్డికిజేరి బాబాను సందర్శించిన 'సదాశివతార్కాడ్' తో) అహమ్మద్‌నగర్ మీదుగ నీ స్వస్థానమగు పూనాకు వెళ్ళుము. తాత్యాపటేల్ తో ఇప్పుడే ప్రయాణమగుము.

సదాశివతార్కాడునకు వెంటనే తిరిగి వెళ్ళుట-అందులో ఏ ఉద్యోగము లేక తిరిగిపోవుట - మిక్కిలి కఠిన సమస్యయైనది. కాని అతడు పూనాచేరగా అచట యంత్ర కర్మాగారమున కూలీలు సమ్మె చేయుటచే ఆ యంత్ర యజమానులు 'తార్కాడ్' రాకకొఱకు అత్యాతురతతో నిరీక్షించుచుండిరి. ఆ యజమానులు "తార్కాడ్" ను ఆ యంత్ర కర్మాగారమునకు కార్య నిర్వాహకునిగ నియమించిరి.

572. సా.బా: (నా.గో.చందోర్కరుతో) నీ వీ రోజున వెళ్ళవలదు. కోపర్గామున కలెక్టరును కలిసికొనుటకు రేపు పొమ్ము.

కలెక్టరు ఆరోజు కార్యక్రమము తంతిద్వారా రద్దుచేసికొని, అ మఱునాడు కోపర్గామునకు 'మకాం' ఏర్పాటు చేసికొనెను. ఆ విషయము చందోర్కరెఱుగడు. బాబా తన అంతర్‌జ్ఞానమున దెలిసికొన జాలినాడు.

573. సా. బా: (పండరిపుర న్యాయవాదితో) నీవీ రోజున బయలుదేరవలదు. నీ పండరి వ్యాజ్యముకొఱకు రేపు ప్రయాణమగుము.

ప్రతిపక్ష - ప్రభుత్వ న్యాయవాది తనకెట్టి సమాచారమందింపకయే మఱునాటికి వాయిదా వేయించికొనినట్లు పండరి న్యాయవాది తరువాత తెలిసికొనెను.

574. హ. సీ. దీక్షిత్తు : (బాబాతో) 6-2-1916న 'విల్' దావా విచారణమునకు వచ్చును. కావున బొంబాయిలోనివారు నన్నిపుడు బయలుదేరి సాక్ష్యమిచ్చుటకు రావలసినదిగా కోరుచున్నారు.

